# స్వాతంత్ర్యోద్యమ గేయాలు

సంకలనం

ఇలపావులూరి పాండురంగ రావు

చిత్రాలు

డి. కె. దాస్



నేషనల్ బుక్ ట్రస్ట్, ఇండియా

# పరిచయం

మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చి యాభై సంవత్సరాలయింది. శతాబ్దాల తరబడి రాజకీయ దాస్యాన్ని అనుభవించి ఈ శతాబ్దం మధ్యభాగంలో సిద్ధించిన యీ సాఫల్యానికి ఈ సంవత్సరం మనం స్వర్ణజయంతి చేసుకుంటున్నాం. ఈ సందర్భంలో ఒక్క సారి వెనక్కి తిరిగి ఈ అర్ధ శతాబ్దంలో మనం సాధించింది ఏమిటి అని ఆలోచన చేసి దూరదృష్టితో ముందడుగు వేసేందుకు ఈ స్వర్ణోత్సవాలు ఉపయోగపడుతాయి.

ముఖ్యంగా ఈ స్వాతంత్ర్యం ఎలా వచ్చింది, దీనికి మూల కారకులు ఎవరు అని తెలుసుకుని ఆ మహనీయులను, మేధావులను, త్యాగులను, యోగులను, కార్యదక్షులను ఒక్క సారి స్మరించటం జాతీయతా లక్షణం. ప్రతి భారతీయుని కర్తవ్యం. ప్రకృతి సిద్ధంగా లభించే పాడి పంటలకు, పురుష ప్రయత్నంతో సాధించదగిన శక్తి సామర్థ్యాలకు ఏ మాత్రం లోటులేని సర్వమంగళ మన భారతదేశం. ఇలాంటి దేశం విదేశీయుల పరిపాలనలో ఉండడం, మన ఇంట్లోనే మనం బానిసలమై జీవించటం జాతికి కళంకమని గుర్తించి మన బతుకు మనం గౌరవంగా బతుకుదాం, మన ప్రాచీన వైభవాన్ని నిలబెట్టుకొని ప్రపంచానికి చేతనయినంత వెలుగును పంచి పెట్టి ఘనంగా, జీవిద్దాం అన్న చైతన్యం గత శతాబ్దం మధ్యభాగంలోనే ఉదయించింది. కాని అది కార్యరూపం తాల్చి ఒక చక్కని బాటలో పయనించడం ఆరంభించింది ఈ శతాబ్ది ఆరంభంలోనే.

'స్వాతంత్ర్యం మా జన్మ హక్కు' అని లోకానికి చాటి చెప్పిన

లోకమాన్య బాల గంగాధర్ తిలక్ స్వాతంత్ర్య సమరానికి నాందిగా పాంచజన్యం పూరించారు. దానితో గోపాలకృష్ణ గోఖలే, లాలా లజపత్‌రాయ్, విపిన్‌చంద్ర పాల్ దాదాభాయి నౌరోజీ, టంగుటూరి ప్రకాశం పంతులు, చక్రవర్తి రాజగోపాలాచారి లాంటి ప్రముఖులు ఈ నాదాన్ని ఆచరణలో చేశారు. వంగ విభజన, స్వరాజ్య సంకల్పం, వందేమాతరం ఆందోళన, జాతీయ విద్యా సంస్థల స్థాపన, అధినివేశ స్వాతంత్ర్యం, స్వదేశీ భావన - అన్నీ ఒకదానివెంట ఒకటి కార్యరంగంలోకి వచ్చాయి. **1915** జనవరిలో గాంధీ మహాత్ముడు రాజకీయ రంగంలోకి ప్రవేశించటం ప్రముఖమైన సంఘటన. ఇంతలో తిలక్ అస్తమించటం దేశానికి పెద్ద అఘాతమైంది. కాని మహాత్మా గాంధీ నాయకత్వంలో జాతీయ చైతన్యం సరియైన మార్గాన్ని అన్వేషించి అనుసరించింది. **1921** మార్చి **31**వ తేదీ విజయవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెసు నిర్వాహక సంఘం స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ఒక దీపశిఖ. ఈ సమావేశం కేవలం ఆంధ్ర రాష్ట్రానికే కాక సమస్త భారతీయ జాతికి ఆశా జ్యోతిని ప్రసాదించింది. తిలక్ స్వరాజ్య నిధికి కోటి రూపాయలు, కోటి మంది సభ్యులు, కోటి రాట్నాలు బాపూ కనుసైగతో సమకూరాయి. నాటితో దేశంలో స్వాతంత్ర్యోద్యమం ఒక మహా యజ్ఞంగా మారింది. ఆ నాటి ప్రముఖ నాయకులందరూ ఆ నాడు విజయవాడలో కూడి ఈ మహోద్యమానికి జయభేరి మ్రోగించారు.

జయభేరితో పాటు జయ జయ నినాదాలు కూడా దేశం నలు మూలలా గేయాలుగా, కావ్యాలుగా, పద్యాలుగా, పాటలుగా ప్రసరించాయి. ఈ సందర్భంలో ప్రఖ్యాత వంగ రచయిత బంకించంద్ర చటర్జీ నోట వెలువడిన 'వందేమాతరం' పాటను స్మరించాలి. 'ఆనంద మఠం' అనే తన నవలలో ఆయన **1884**లో రచించిన యీ పాట వేదమంత్రంగా ప్రసరించి ఒక శతాబ్దం

గడిచిన మన స్వాతంత్ర్యోద్యమ మహాయాత్రకు బాట చూపింది. 'వందే మాతరం' అని ఎవరయినా నినాదం చేస్తే వాళ్ళను అరెస్టు చేసేవారు. ఇలాగే జాతీయ పతాకాల నెగుర వేసినా, గాంధీ టోపీ కనిపించినా పోలీసులు పట్టుకునేవారు. 1923 మే 1వ తేదీన నాగపూరులో జండా సత్యాగ్రహోద్యమం ఆరంభమయింది. 1930 ఏప్రిలు 6వ తేదీ బందరులోని ఒక కోనేటి మధ్య జాతీయ పతాకను ఎగురవేయాలని ప్రయత్నించిన వాళ్ళందరూ లాటీ దెబ్బలు తిన్నారు. చివరకు మొండిపట్టు పట్టి తోట నరసయ్య అనే దేశభక్తుడు మన జండాను ఎగురవేసి తీరారు. దానికి తన ప్రాణాలనే ఆహుతిగా ఆనందంగా అర్పించేందుకు సిద్ధమైనారు. ఇలాంటి జండా వీరులు దేశంలో ఎందరో బయలు దేరారు. జాతీయ పతాకను రూపొందించింది ఆంధ్ర జాతీయ కళాశాల ఉపాధ్యాయులు శ్రీ పింగళి వెంకయ్యగారు. ఇలాగే ఉప్పు సత్యాగ్రహం కూడా ఎందరో కవులనో గాయకులనో, త్యాగవీరులనో ఆకర్షించింది. కుల మత భాషా భేదాలు లేకుండా సమస్త జాతి యీ జాతీయ యజ్ఞంలో పాల్గొన్నది.

స్వాతంత్ర్యోద్యమం ముందుకు సాగే కొద్దీ సత్యాగ్రహాలూ, సహాయ నిరాకరణాలూ, పోలీసు చర్యలు, కారాగారవాసాలు, సూత్ర యజ్ఞాలు (రాట్నంపై నూలు వడకడం), విదేశీ వస్త్రాలను నడి వీధిలో అగ్నిహోత్రుడికి ఆహుతి చేయటం, దేవాలయాలలో షెడ్యూల్డ్ కులాలు ప్రవేశం లాంటి అనేక కార్యకలాపాలతో దేశమంతా స్పందించింది. నిద్రాహారాలు లేకుండా భారత మాతను స్మరిస్తూ గాంధీ చెప్పిన మాటలను, బాటలను అనుసరిస్తూ ఆడుతూ పాడుతూ, ఈ మహాయజ్ఞంలో పాల్గొన్న మహనీయుల దీక్ష వల్లనే మనకు స్వాతంత్ర్యం లభించింది. ఆనాడు పాడిన పాటలను వింటుంటే ఒళ్ళు గగుర్పాటు చెందుతుంది. ఇప్పుడు మనం మన కళ్ళ ఎదుట ఆ దృశ్యాలను చూస్తున్నట్టు అనిపిస్తుంది.

అలాంటి పాటల్లో కొన్నింటిని ఈ చిన్న పుస్తకంలో చేర్చి ప్రచురించటం జరిగింది.

చరిత్ర కేవలం సంఘటనలను చెప్తుంది. ఏమి జరిగిందో చెప్తుంది. కాని జాతి మనస్సును మన మనస్సులో నాటుకునేట్లు నిరూపించేది ఆ నాటి మాటలు, పాటలు, నినాదాలు, పద్యాలు, కావ్యాలు, సాహిత్యం జాతి మనస్సును, మన మనస్సుల అద్దాలలో ప్రతిబింబింప చేస్తుంది. గడచిన యాభై యేళ్ళలో స్వతంత్ర భారతం అనుభవిస్తున్న స్వాతంత్ర్యం వెనుక ఎంత తపస్సు, సాధన, నిష్ఠ, ఆవేదన రోదన, దాగి ఉన్నదో, ఈ సంకలనంలోని గేయాలు చెప్తాయి.

ఈ శతాబ్దం ఆరంభం నుంచి మనకు స్వాతంత్ర్యం వచ్చే వరకు దాదాపు ఒక అర్ధ శతాబ్దం ఆంధ్రావని నలు మూలల్లో వినిపించిన నినాదాలు, ఆర్తనాదాలు, జయగీతికలు, వీరగాథలు, దేశభక్తి గీతాలు, కవుల కావ్య మాలికలు, గాయకులు పాడిన గేయాలు, ఉద్యమంలో ఉరికి అష్ట కష్టాలను అనుభవించిన కర్మవీరులు గుండె బరువును తగ్గించుకునేందుకు ఎలుగెత్తి పాడిన హృదయ గీతికలు లెక్క లేనన్ని మన తెలుగులో ఆ నాడు వెలుపడ్డాయి. వాటిలోని చాలా గేయాలు కాలంలో కలిసి పోయాయి. స్వాతంత్ర్యం రాగానే ఆ గాయాలను మరచిపోలేని స్వాతంత్ర్య యోధులు, సారస్వత జీవులు కొందరు వీటిని సేకరించి ప్రచురించారు. అలాంటి వాళ్ళ శ్రమ ఫలితంగా మనకు కొన్ని గేయాలు, పద్యాలు మిగిలాయి. వీరిలో 'కవిశేఖర' గురజాడ రాఘవ శర్మగారు ప్రముఖులు. స్వయంగా స్వాతంత్ర్య సమరంలో పాల్గొని, తాను రచించినవే కాక మిగిలిన యోధులు రచించిన పాటలను కూడా పల్లెల్లో, పట్టణాల్లో, సమావేశాల్లో పాడి వినిపించి ప్రజలలో జాతీయ చైతన్యాన్ని మేల్కొల్పిన మహనీయులు గురజాడ రాఘవ శర్మగారు. అలాగే

గరిమెళ్ళ సత్యనారాయణగారు వందల కొలది పాటలను అశువుగా అల్లి పాడిన గేయ కవితా సార్వభౌముడు. అవి పాటలు కాదు, జాతిపురుషుని ప్రాణవాయువులంటారు.

నిజానికి జాతీయ గీతాలు రచించి జనసామాన్యంలో వాటిని ప్రచారంలోకి తీసుకుని వచ్చిన శత సహస్ర మహనీయుల్లో గురజాడ, గరిమెళ్ళ వ్యాస వాల్మీకుల వంటి వారు. 'మా కొద్దు ఈ తెల్ల దొర తనము' అన్న పాట గరిమెళ్ళ వారిదే. 'వందన మిదె గైకొనుమా భారత జననీ' అన్న వందన గీతం కూడా వారిదే. బంకిం చంద్ర చటర్జీ వ్రాసిన 'వందే మాతరం' పాట దేశానికంతా ఎలా తలమానికమయిందో అలాగే గరిమెళ్ళ-గురజాడ వారి గేయాలు ఆ నాడు ఆంధ్ర దేశంలోని వీధి వీధిలో ప్రతిధ్వనించాయి.

ఇలాంటి తెలుగు పాటలు కొన్ని సేకరించి గ్రామీణ పాఠకులకు అందుబాటులో ఉండేలాగా వాటిని ప్రచురించాలన్న మంచి ఆలోచన నేషనల్ బుక్ ట్రస్టు వారి మనస్సులో ఉదయించటం శుభసూచకం. దానికి నన్ను వాక్సారథిగా నియమించినందుకు నేను వారికి కృతజ్ఞుడ్జి.

ఈ సంకలనంలో 35 తెలుగు గేయాలు ఉన్నాయి. అన్నీ ఆ రోజుల్లో బాగా ప్రచారంలో ఉన్నవే. ఆ రోజుల్లో గురజాడ అప్పారావు, రాయప్రోలు సుబ్బారావు, దేవులపల్లి కృష్ణ శాస్త్రి, చిలకమర్తి లక్ష్మీనరసింహం లాంటి మహనీయులు కూడా చాలా మంచి పాటలు రచించారు. కొందరు మహాకవులు తమ సారస్వత పరిధిని పద్యాలవరకే పరిమితం చేసుకున్నారు.వారి పాటలను మాత్రం ఇందులో చేర్చుకోవటం జరిగింది. ఇది ముఖ్యంగా పాటల సంకలనం కాబట్టి, తెలుగు నాట ఆ నాడు ప్రతి పౌరుని నోట చోటు చేసుకున్న పాటలనే ఈ పుస్తకంలో పాఠకులు చూస్తారు.

విషయ వస్తువును బట్టి ఇందులోని పాటలను నాలుగు భాగాలుగా విభజించవచ్చు. మొదటి భాగంలో 'దేశభక్తి'కి సంబంధించిన పాటలున్నాయి. ఇది ఒక విధంగా స్వాతంత్ర్యో ద్యమానికి మూలాధారం. దేశభక్తి అనేది ఉంటేనే స్వాతంత్ర్య లాలస, ఉద్యమం ఆందోళన లాంటివి సాధ్యమవుతాయి. దేశభక్తికి తోడు పూజ్య బాపూజీ లోని 'ఆత్మశక్తి' జాతికి సరియైన సమయంలో లభించటం విశేషం. యుగపురుషుడని చెప్పుకోదగిన మహాత్ముని 'ఆత్మశక్తి'ని కీర్తించిన గేయాలు రెండో భాగంలో చేర్చటం జరిగింది. ఈ భక్తినీ, ఈ శక్తినీ సరిగా అర్థం చేసుకుని నిస్వార్థంగా నిర్మలమైన 'చిత్తశుద్ధి'తో తమ సర్వస్వాన్ని తల్లి పాదాలపై సమర్పించిన దేశోద్ధారకులను గురించిన పాటలు మూడో భాగంలో ఉన్నాయి. స్వాతంత్ర్యం సిద్ధించింది. అది ఒక చారిత్రాత్మకమైన చిరస్మరణీయమైన ఘటన. ఈ భావాన్ని పాటలుగా పాడిన రచనలను చివరి భాగం 'కార్యసిద్ధి'లో చేర్చాం.

ఇలా దేశభక్తి, ఆత్మశక్తి, చిత్త శుద్ధి, కార్యసిద్ధి - అన్న నాలుగు భాగాల్లో ముప్పైఐదు తెలుగు గేయాలతో కూడిన ఈ సంకలనం చూచేందుకు చిన్నదైనా చూచి గమనించి జాతీయ చైతన్యమంటే ఏమిటో తెలుసుకునేందుకు ఎంతో కొంత తప్పక ఉపకరిస్తుందనే ఆశించవచ్చు.

ఈ పాటలన్నీ తెలుగువే అయినా దీనికి 'నాంది'గా 'ఆనంద మఠ' రచయితలు, అమృత వాక్కులు అయిన శ్రీ బంకించంద్ర చటర్జీ వారి 'వందే మాతరం'గేయంతో ఈ సంకలనానికి శ్రీకారం చేయటం జరిగింది. అలాగే జాతీయ గీతంగా మన జాతి నిత్యం స్మరించే 'జనగణమన' గానం దీనికి 'భరత వాక్యం' పలికింది. మహామానవ సాగరతీరంలో నిలబడి విశ్వభారతిగా భారతీయతను సాక్షాత్కరించుకోగలిగిన విశ్వహృదయుడు రవీంద్రుడు. అతని

జయకారమే ఈ సంకలనానికి శాంతి వాక్యం.

ఈ సంకలనం పాఠకుల హృదయంలో ఏ మాత్రం స్వదేశీ భావనను, జాతి గౌరవాన్ని స్పందింప చేయ గలిగినా ఈ ప్రయత్నం సార్థకమవుతుంది.

- **ఇలపావులూరి పాండురంగ రావు**

# మాతృశ్రీ వందనం

బంకించంద్ర చటర్జీ

వందే మాతరమ్

సుజలాం సుఫలాం మలయజ శీతలాం

సస్య శ్యామలాం - మాతరం || వందే మాతరమ్ ||

శుభ్రజ్యోత్స్నా పులకిత యామినీం

ఫుల్ల కుసుమిత ద్రుమదళ శోభినీం

సుహాసినీం సుమధుర భాషిణీం

సుఖదాం వరదాం మాతరం

|| వందే మాతరం ||

# ఇందులోని పాటలు


పేజీ

పరిచయం 3

మాతృశ్రీ వందనం - వందే మాతరం : బంకించంద్ర చటర్జీ 10

## దేశభక్తి

1. దేశభక్తి : గురజాడ అప్పారావు 13
2. శ్రీలు పొంగిన జీవగడ్డ : రాయప్రోలు సుబ్బారావు 14
3. జయభారత మధుర గీతి : దేవులపల్లి కృష్ణ శాస్త్రి 17
4. జోహార్ జోహార్ భారతమాతా : దువ్వూరి రామిరెడ్డి 18
5. భారత జననీ : గురజాడ రాఘవ శర్మ 19
6. మాతృ స్తవమ్ : గరిమెళ్ళ సత్యనారాయణ 20

## ఆత్మశక్తి

7. మా గాంధీ : బసవరాజు అప్పారావు 21
8. శ్రీ గాంధినామం : దామరాజు పుండరీకాక్షయ్య 22
9. మహాత్ముడు : చుక్కభొట్ల సత్యనారాయణ మూర్తి 22
10. హిమాలయోత్తుంగ శృంగం : అడవి బాపిరాజు 24
11. ఎవరి పాద చిహ్నములివి? : 'దాశరథి' 26

## చిత్తశుద్ధి

12. పాంచజన్యము : మంగిపూడి పురుషోత్తమ శర్మ 28
13. దేశమాతా సేవ చేయండీ : కొండపల్లి జగన్నాథ దాసు 29
14. జయభేరి మ్రోగింది : మల్లాది చంద్రశేఖర రావు 31
15. వీరగంధము : బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి 32

16. మరచి పోవద్దోయ్ : త్రిపురనేని రామస్వామి చౌదరి 34
17. మా దేశం : వానమామలై వరదాచార్యులు 35
18. అయ్యో కొయ్యాద : గరిమెళ్ళ సత్యనారాయణ 36
19. పదరా ఢిల్లీ! : గురజాడ రాఘవ శర్మ 37
20. పద వద ఢిల్లీ! : మల్లాది రామచంద్ర శాస్త్రి 38
21. రారా పోదాము : గరిమెళ్ళ సత్యనారాయణ 39
22. ఎదురు లేదు : యడ్లపల్లి కోటయ్య 40
23. రాట్నె లక్ష్మి : కాటూరి వెంకటేశ్వర రావు 41
24. స్వాతంత్ర్య శంఖారావం : మాముసూరు నాగభూషణ రావు 42
25. సహాయ నిరాకరణం : కొండపల్లి జగన్నాథ దాసు 43
26. ఉప్పు చేశామిదిగో చూడండి : మంగిపూడి పురుషోత్తమ శర్మ 44
27. మా కొద్దీ తెల్ల దొరతనము : గరిమెళ్ళ సత్యనారాయణ 45
28. వద్దురా మనకొద్దురా : గరికపాటి మల్లావధాని 47
29. వీరావేశం : మల్లాది రామచంద్ర శాస్త్రి 48
30. విప్లవ జ్వాల : సాంబశివరావు బాబ్జీ 49

## కార్యసిద్ధి

31. ఆగస్టు పదిహేను : ధవళా శ్రీనివాసరావు 51
32. భారత విజయం పాడండి : వేదుల సత్యనారాయణ శాస్త్రి 52
33. పతాకోత్సవము సేయండి : బసవరాజు అప్పారావు 53
34. స్వాతంత్ర్య పతాక : నుంకర సత్యనారాయణ 54
35. స్వాతంత్ర్య భారత జాతీయ జండా : గురజాడ రాఘవ శర్మ 55
జాతీయ గీతం - జనగణమన 56



# 1. దేశభక్తి

గురజాడ అప్పారావు

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వట్టి మాటలు కట్టి పెట్టోయ్!
గట్టి మేల్ తలపెట్టవోయ్!

పాడి పంటలు పొంగి పొర్లే
దారిలో నువ్ పాటు పడవోయ్
తిండి కలిగితే కండ కలదోయ్
కండ కలవాడేను మనిషోయ్!

దేశాభిమానము నాకు కద్దని
వట్టి గొప్పలు చెప్పుకోకోయ్
పూని యేదైనాను ఒక మేల్
కూర్చి జనులకు చూపవోయ్.

సొంత లాభము కొంత మానుకు
పొరుగు వారికి తోడు పడవోయ్
దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్.

చెట్ట పట్టాల్ పట్టుకొని
దేశస్థులంతా నడువ వలెనోయ్
అన్నదమ్ముల వలెను జాతులు
మతములన్నీ మెలగ వలెనోయ్

మతం వేరైతేను ఏమోయ్
మనసు ఒకటై మనుషులుంటే
జాతి యన్నది లేచి పెరిగి
లోకమున రాణించునోయ్.

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్త వలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్.

ఆకులందున అణగి మణగి
కవిత కోయిల పలక వలెనోయ్
పలుకులను విని దేశమందభి-
మానములు మొలకెత్త వలెనోయ్

## 2. శ్రీలు పొంగిన జీవ గడ్డ

రాయప్రోలు సుబ్బారావు

శ్రీలు పొంగిన జీవగడ్డయి
పాలు పారిన భాగ్య సీమయి
వ్రాలినది ఈ భరత ఖండము
భక్తి పాడర తమ్ముడా!

వేద శాఖలు పెరిగెనిచ్చట
ఆది కావ్యం బందె నిచ్చట
బాదరాయణ పరమ ఋషులకు
పాదు సుమ్మిది చెల్లెలా!

విపిన బంధుర వృక్ష వాటిక
ఉపనిషన్మధు వొలికె నిచ్చట
విపుల తత్త్వము విస్తరించిన
విమల తలమిదె తమ్ముడా!

సూత్ర యుగముల శుద్ధ వాసన
క్షాత్ర యుగముల శౌర్య చండిమ
చిత్ర దాస్యముచే చరిత్రల
చెరగి పోయెను చెల్లెలా!



మేలు కిన్నెర మేళవించీ
రాలు కరగగ రాగమెత్తీ
పాల తీయని బాల భారత
పదము పాడర తమ్ముడా!

నవ రసమ్ములు నాట్యమాడగ
చివుర పలుకులు చెవుల విందుగ
కవితలల్లిన కాంత హృదయుల
గౌరవింపవె చెల్లెలా!

దేశ గర్వము దీప్తి చెందగ
దేశ చరితము తేజరిల్లగ
దేశమరసిన ధీర పురుషుల
తలిసి పాడర తమ్ముడా!

పాండవేయుల పదును కత్తులు
మండి మెఱసిన మహిత రణ కథ
కండగల చిక్కని తెలుంగుల
కలసి పాడవె చెల్లెలా!

లోకమంతకు కాకపెట్టిన
కాకతీయుల కదన పాండితి
చీతి పోవని చేవ పదముల
చేర్చి పాడర తమ్ముడా!

తుంగభద్రా భంగములతో
పొంగి నింగిని పొడిచి త్రుళ్ళి
భంగపడని తెలుంగు నాథుల
పాట పాడవె చెల్లెలా!

## 3. జయ భారత మధుర గీతి

దేవులపల్లి కృష్ణశాస్త్రి

జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ, దివ్య ధాత్రి!
జయ జయ జయ శత సహస్ర
నర నారీ హృదయ నేత్రి!
జయ జయ సస్యామల సు-
శ్యామ చలచ్చేలాంచల!
జయ వసంత కుసుమ లతా
చరిత లలిత చూర్ణ కుంతల!
జయ మదీయ హృదయాశయ
లాక్షారుణ పదయుగళా॥
జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్య ధాత్రి
జయ దిశాంత గత శకుంత
దివ్య గాన పరితోషణ!
జయ గాయక వైతాళిక
గళ విశాల పద విహరణ!
జయ మదీయ మధుర గేయ
చుంబిత సుందర చరణా॥
జయ జయ జయ ప్రియ భారత
జనయిత్రీ దివ్య ధాత్రి!

# 4. జోహార్ జోహార్ భారత మాతా

దువ్వూరి రామిరెడ్డి

జోహార్ జోహార్ భారత మాతా
జోహార్ జోహార్ జోహార్

శారద శుభ్ర వియత్తల పథమున సంచరించు నీ రథము
నీ మృదు వీణాగాన ప్రబుద్ధము - నిత్యము మా మనము
|| జోహార్ జోహార్ ||

ప్రత్యూష లక్ష్మి మకుట మణిప్రభ-బాసె దమోగుణము
నీ పద పంకజ నూపుర ఝుంకృతి-నిద్రా విరహితము
|| జోహార్ జోహార్ ||

విప్లవ ఝుంఝూ విచలిత జీవన-వీచి నికాయమున
స్థిర విజయోడుప కర్ణ ధారణము-సేయుము శౌర్యమున
|| జోహార్ జోహార్ ||

ముకుళిత హస్తులు నీ ప్రియ పుత్రులు-మోద దృష్టి గనుము
నీ కరుణామృత నిర్ఝర పూరము-నింపుమమ్మ సతము
|| జోహార్ జోహార్ ||

నీ పద పీఠిని ప్రాణ సుమంబులు నిల్పి భజించెదము
గర్హిత దాస్య భరంబును మాన్పి-సుఖంబులు మాకిడుము.
జోహార్ జోహార్ భారత మాతా
జోహార్ జోహార్
జోహార్

## 5. భారత జనని

**గురజాడ రాఘవ శర్మ**

పల్లవి: జయ జయ భారత జననీ, పావని

అనుపల్లవి: జయ జయ సకలానంద దాయినీ

హిమాలయోన్నత సమాదర్శిని
తమోదళన విద్యా స్వరూపిణి || జయ జయ ||

సంతత సస్య శ్యామల రూపిణి
సంచిత సకలైశ్వర్య దాయిని || జయ జయ ||

పావన గంగా జీవన శోభిని
పతితోద్ధారిణి పాప విదారిణి || జయ జయ ||

మధుర కుసుమ ఫల మంద సుహాసిని
మంజుల శుక పిక మధుర సుభాషిణి || జయ జయ ||

వీర ధీర నర-నారీ రూపిణి
వైర-వర్గ సంహారిణి, తారిణి || జయ జయ ||

సార్థక ధర్మ-చక్ర పతాకిని
సకల సౌఖ్య రాజ్య ప్రదాయిని || జయ జయ ||

విశ్వలోక హిత-విజయ కిరీటిని
శాశ్వత మంగళ-శాంతి దాయిని || జయ జయ ||

# 6. మాతృస్తవమ్

గరిమెళ్ళ సత్యనారాయణ

వందనమిదె గైకొనుమీ - భారత జననీ!
భారత జననీ! మా పాలిటి రాణీ || వందన ||
నందనుల బ్రోవుమీ ఆనంద దాయినీ
ఆనంద దాయినీ - ముని బృంద వందినీ || వందన ||
ముప్పది కోట్ల జనమునకు మూల మాతవు
మూల మాతవు - మా పాలి నేతవు || వందన ||
మాదు భాగ్యములకు నెల్ల మహిత కర్తవు
మహిత కర్తవు - మా అఘ విహార్తవు || వందన ||
సకల సంపదలకు నీవు సంగ్రహాంబవు
సంగ్రహాంబవు - గర్వ సంహారంబవు || వందన ||
సాత్విక నిరోధమునకు జన్మశాఖవు
జన్మ శాఖవు - పటు జన సమేతవు || వందన ||
యుద్ధశకము మాన్పునట్టి బుద్ధిశాలివి
బుద్ధిశాలివీ - అప్రతిహత శుద్ధ శీలివి || వందన ||

# 7. మా గాంధీ

బసవరాజు అప్పారావు

కొల్లాయి గట్టితేనేమి? మా గాంధి
కోమటై పుట్టితేనేమి?
వెన్న పూసా మనను - కన్న తల్లీ ప్రేమ
వంతంటి మోముపై - బ్రహ్మ తేజస్సు

॥ కొల్లాయి ॥

నాల్గు పరకల పిలక
నాట్యమాడే పిలక
నాలుగూ వేదాల నాణ్యమెరిగిన పిలక

॥ కొల్లాయి ॥

బోసి నోర్విప్పితే
ముత్యాల తొలకరే
చిరునవ్వు నవ్వితే వరహాల వర్షమే

॥ కొల్లాయి ॥

చకచక నడిస్తేను
జగతి కంపించేను
పలుకు పలికితేను
బ్రహ్మ వాక్యయ్యేను
కొల్లాయి గట్టితేనేమి
మా గాంధి
కోమటై పుట్టితేనేమి
మా గాంధి
మాలడై తిరిగితేనేమి!

## 8. శ్రీ గాంధి నామం

బసవరాజు అప్పారావు

శ్రీ గాంధి నామం - మరువాం మరువాం
సిద్ధము జైలుకు వెరువాం వెరువాం
మా గాంధినే మేం - నమ్మేం నమ్మేం
మరి యెవ్వరిని మేం - నమ్మాం నమ్మాం
దేశ చరిత చెవుల - విందాం విందాం
వేరు కథలు చెవుల - మందాం మందాం
లాటీ దెబ్బలు మేము - బెదరాం బెదరాం
మేటి తుపాకికి - చెదరాం చెదరాం
శ్రీ గాంధి నామం - మరువాం మరువాం
సిద్ధము జైలుకు - వెరువాం వెరువాం
కూడి భారతమంత - గొలుతాం గొలుతాం
నేడే స్వరాజ్యాన్ని - తెస్తాం తెస్తాం
దేశభక్తులు మాకు - సారాం సారాం
దేశద్రోహులు మాకు - దూరాం దూరాం

## 9. మహాత్ముడు

చుక్కభొట్ల సత్యనారాయణ మూర్తి

కట్టుకొన్నది అంగవస్త్రము
పట్టుకొన్నది రాట్న చక్రము

పట్టుమని పది మెతుకులైనా
పట్టకుండు కృశోదరముగల
గాంధీ కంటెను సామ్యవాదులు
కలరె! లోకములో

ధనము తృణముగ తలచి మెలగుచు
మనమునందైచ్ఛిక దరిద్రము
అనుభవించుచు దేశసేవకు
తనువొసంగిన ఘన చరిత్రుడు
గాంధికంటెను సామ్యవాదులు
కలరె! లోకములో



దేశమే తన శరీరంబని
దేశహితమే తన హితమ్మని
లేశమైనను భేదమెంచని
ఘానుర చరిత్రుడు మహాత్మా
గాంధికంటెను సామ్యవాదులు
కలరె! లోకములో
భూషణములకు తోషమందడు
దూషణములకు రోషమందడు
ద్వేషమందడు శత్రువులపై
దోషభయమును కప్పిపుచ్చడు
|| గాంధికంటెను....... ||

## 10. హిమాలయోత్తుంగ శృంగం

అడవి బాపిరాజు

హిమాలయోత్తుంగ శృంగం నీ బ్రదుకు
ఉమాపతీ నృత్య రంగం
దేశాల వాంఛిల్లు
ఆశా హృదయముల్లు
నేలొదలి పోలేని శీతల తలాలలో
జీమూత పంక్తిపై
వ్యోమ వర్త్మము జొచ్చి - ఓ! స్వామి
తమో నుద స్వచ్ఛమౌ
|| హిమాలయోత్తుంగ శృంగం ||

సర్వపథ జనకోట్లు
సాగి యాత్రార్థులై
జన్మలు పవిత్రమై
చవులొంద - స్నాతులగు
సంగమానికి చేరు
నీ కళ్ళ తళత్తళలు
నీ మాట పాటలు
నీ నవ్వ రసముల్లు
వేణీత్రయమ్మోచు
నీ నుండి వెడలెరా
అది మహా సత్యమ్ము
|| హిమాలయోత్తుంగ శృంగం ||
శిల్ప సూత్రార్థాలు
తెల్పు సౌందర్యాలు
స్వల్పమై మూర్తిలో
దేశ దేశాల ఆశాంతాల
వెలిగిస్తూ
నీ బోసి నవ్వులో
నీ సృష్టి వాక్కులో
నీ కన్ను జంటలో
రేకలు తిరుగుతూ మహాత్మా !
లోక మోహనమయ్యే
హిమాలయోత్తుంగ శృంగం - నీ బ్రదుకు
ఉమాపతీ నృత్య రంగం

## 11. ఎవరి పాద చిహ్నములివి?

'దాశరథి'

ఎవరి పాద చిహ్నములివి?
ఎవరి పాద చిహ్నములు?
ఆతని ప్రతి అడుగు గురుతు
ఆలయమ్మై తల యెత్తును
అతని చేతి గొడుగు క్రింద
అఖిల జగము శయనించును
దానవులను కరగించిన
మానవుడతడెవ్వడు?
గుండెనొడ్డి తుపాకీల
గుండె పగల గొట్టె నతడు
రాట్నంతో రణశూరుల
ఈ చెల నెదరించె నతడు
హిమాలయం కన్న ఎత్తు
ఎవడాతండెవ్వడు?
ప్రతి మానవ హృదయమ్మున
ఒదిగి పోవ జాలు నతడు
విశ్వములో ప్రతి ప్రాణిని
ప్రేమించగ జాలు నతడు
కత్తికి కన్నీరు గూర్చు
కరుణాకరు డెవ్వడు?

విషమిచ్చిన వాని కమృత
చషక మిచ్చె నాతడు.
కారాగారము స్వర్గము
గా, మారిచెనాతడు.
తర తరాల మన సంస్కృతి
తానై నిలిచిన దెవ్వడు?
ఓపిక రూపం దిద్దుక
ఊరికి వచ్చె నాతనిలో
'శాంతి' శరీరమ్ము బూని
సాగి వచ్చె నాతనితో
'మంచి'మరాళము పోలిక
మసలు నెవని మనసులో?
'క్షమ' శిశు శశి నవ రేఖా
సదృశమయ్యె నతని శిరసి
'ఔదార్యం' అతని నుండి
అమర వాహినిగ దూకును.
ఎవరి తనువు గతాగతము లేకమైన యతుల తోము?
ఎవని చిన్ని నివాసము అవనికి శ్రీ కైలాసము?
గుండెలలో అతడున్న కొంచెము సేపాపుడీ?
కన్నులలో అతడున్న కాస్త నాకు చూపుడీ!
ఎవరి పాద చిహ్నములవి?
ఎవరి పాద చిహ్నములు?

## 12. పాంచజన్యము

మంగిపూడి పురుషోత్తమ శర్మ

భారత దేశము నాదేరా!
భారతీయుడను నేనేరా!

|| భారత దేశము ||

భారత దేశము ప్రజా స్వామికము
బడయగోరినే - బయలు వెడలితిని

|| భారత దేశము ||

పారతంత్ర్యమును పారద్రోలుటకు
బద్ధకంకణుడ - బయలు దేరితిని

|| భారత దేశము ||

శాంతి సమరమున సత్స్వారాజ్యమును
సత్వరముగనే సమార్జించెదెను.

|| భారత దేశము ||

ప్రాణము పోయిన - మానము విడువను
మాన ధనుడ - విజ్ఞాన ధనుడనే
భారత దేశము నాదేరా
భారతీయుడను నేనేరా ||

## 13. దేశమాతా సేవ చేయండీ

కొండపల్లి జగన్నాథ దాసు

దేశమాతా సేవ చేయండీ! జనులార! భారత
దేశ దాస్యము తొలగ జేయండీ ||
దేశభాగ్యము చూరగొనగా - లేశమను మానింపకను, పర
దేశవాసులు చేయు మాయా పాశముల బడి నాశ మొందక
|| దేశమాతా.... ||

దేశ వస్త్రంబులనె తాల్చండీ! జనులార! మీరు, వి
దేశ వస్త్రములంట బోకండీ
దేశ నాశనకరములగు మీ-వేషభూషల రోసి, మోహా
వేశమును బరిమార్చి, 'గాంధ్యు'పదేశమును మీ మదిని నిల్పియు
|| దేశమాతా.... ||

భోగముల కాసించ బోకండీ - స్వారాజ్య ప్రాప్తికి
త్యాగమును గావింప బూనండీ
అఖిల భారత సభల లోపల - బాగుగా మన భారతులచే
కనుగొనంబడు కార్యసాధన - సాగ జేయుట గుర్తెరింగియు
|| దేశమాతా.... ||

ముందు వెనుకలు చూడబోకండీ - శ్రీ భరతమాతకు
నందనులుగా బ్రతుక గోరండీ
క్రిందుగా సర్కారు వారతి - క్రౌర్యవృత్తిని మిమ్ము బట్టుక
బంది ఖానుల నుంతు రేనియు - భావమందున ఏవగింపక
|| దేశమాతా.... ||

అంటరాని తనమె లేదండీ - మన దేశ వాసుల
నందరినీ ఒక రీతి చూడండీ
కంటికగుపడు నిమ్న జాతులనంటి కొన్నను దోస మనుచును
కంటకింపక కూర్మిమై, మీ వంటి వారని మది దలంచుచు
|| దేశమాతా.... ||

పాలు మాలిక చెందబోకండీ - జాతీయ విద్యా పద్ధతిని యోచింప
రేమండీ
చాలగను జాతీయ విద్యా-శాలలను ప్రతి చోట నిల్పియు
బాల బాలికలకును చదువు - బాగుగా నేర్పించి మీరట
|| దేశమాతా.... ||

తగవులన్నీ మానవలెనండీ - సర్కారు కోర్టుకు
తగుదుమని యిక సాగి పోకండీ
తగిన పెద్దలు చెప్పు పగిదిని - జగడముల వే
దీర్చుకొనుచును జగతి మెచ్చగ ఐకమత్యము చాల
సంపాదించి మీరలు
|| దేశమాతా.... ||

ధరన హింసా వ్రతము పూనండీ - శ్రీ గాంధి దేవుని
పాంచజన్యపు పిలుపు వినరండీ
గరిమతో సారాయి మొదలగు - కైపు వస్తువులన్ని విడచియు
స్థిర మనంబున మీ ధనంబు స్వరాజ్య సమరమునకు ఒసంగుచు
దేశమాతా సేవ చేయండీ! జనులార భారత
దేశ దాస్యము తొలగ జేయండీ ||

# 14. జయభేరి మ్రోగింది

పుల్లాది చంద్రశేఖర రావు

జయభేరి మ్రోగింది - జనులారా లేవండి
జయము పొందెడి దాక - శాంతమూ లేదండి
జంకు గొంకూ లేక - ఛంగు ఛంగున రండి
దేశ సేవను చేయ - ధీరులై నిలువండి || జయభేరి ||
భారత జాతీయ గౌరవం నిలపండి
ఆశ పెట్టెడి వారి కమ్ముడు పోకండి
కాసు బేరానికి - కక్కుర్తి పడకండి
బానిసత్వము బాపు బాసలు చేయండి || జయభేరి ||
మానవ సేవయే మదిలోన తలచండి
ప్రాణాలు మానాలు బలియిచ్చి రారండి
హెచ్చు తగ్గులు లేవు - ఎవరికెవరండి
కాలి నడకన మీరు - కదలి రారండి
జయభేరి మ్రోగింది జనులార లేవండి ||



# 15. వీరగంధము

బెల్లంకొండ చంద్రమౌళి శాస్త్రి

వీరగంధము తెచ్చినారము - వీరు లెవ్వరో తెల్పుడీ!
వీరగంధమలంది పాడెడి - విమల కంఠము నెత్తుడీ!
పాండవేయుల పదును రణకథ - మాట జ్ఞప్తికి యున్నదా?
ఆంధ్ర విష్ణుని అంప వానలు - అప్పుడే స్మృతి దప్పెనా?
బాల చంద్రుని బ్రహ్మనాయని - బాకు సోకులు మరతురా?
కాకతీయుల కత్తి తళతళ - కనుల నేటికి మెరయదా?
కృష్ణరాయల కరము గరువము - కీర్తి సౌధము గట్టదా?
బొబ్బిలీశుల బొబ్బదెబ్బలు - భూనభంబులు గప్పవా?
|| వీరగంధము ||

సిపాయీల చిచ్చుకలహము - చెవుల మ్రోగుచు నున్నదే?
ఖిలాఫత్ సమరంపు టైక్యత - ఖులాసాగా నున్నదే?
జలియన్‌వాలా బాగ్ ధైర్యము - చలన మొందగ లేదదే
సైమన్ కమిషన్ ద్రిప్పు శూరత - చల్ల బడనే లేదదే
|| వీరగంధము ||

దండి సత్యాగ్రహాపుదండే - దసల లేదటు చూడుడా
విదేశ వస్త్రాల నిరసన - వీర కార్యము చూడుడా
వృత్తి సత్యాగ్రహా వ్యక్తీ - వద్ద నున్నది తలపు డా
క్విట్ ఇండియా ఉద్యమమ్మూ - పటుత్వమ్మును పట్టుడా
|| వీరగంధము ||

మహాత్ముజీ అహింసావ్రత - మాన్య ధీరత మనలగా
జవహరలాల్ త్యాగపౌరుష - బుద్ధి వరవడి దిద్దగా
సుభాష్ చంద్రుని శూర ధీరత - కిరీటంబును నిల్పగా
ఆంధ్ర కేసరి ఆత్మధైర్యము - అలంకారము చేయగా
శ్రీ సరోజిని స్వాతంత్ర్యపు - జీవగానము కరుగగా
భోగరాజుని భోగ విరమణ - పూర్ణ ధీమతి మ్రొక్కగా
|| వీరగంధము ||

రాట్నె చక్రము రంయి రంయని - రాజ్య చక్రము ద్రిప్పదా?
మాతృ సేవా మహిత ధర్మము - మధుర దుగ్ధములియ్యదా?
అహింసా వ్రత సహన శక్తి - అమృతము వర్షింపదా?
సత్య కంకణ ధారణమ్మున - స్వాతంత్ర్యము సాగదా?
|| వీరగంధము ||

దేశసేవకు అనువులొసగిన - ధీరవర్యుల తెలియుడీ
తల్లి చెరవిడిపింప తరలిన - ధర్మ వీరుల దలపుడీ!
దాస్య బంధము త్రెంపు మార్గము - దీసినాత్మజు మ్రొక్కుడీ
ఐకమత్యమె బలమటన్నా - అమర మూర్తికి సాగుడీ
|| వీరగంధము ||

కత్తికన్నను కలము శక్తే - గాఢమనగల రెవ్వరో
కష్టజీవుల కరుణ కావ్యము - గాన మొనరుతు రెవ్వరో
స్వేచ్ఛకోసము జీవితంబును - ధారవోయుదు రెవ్వరో
మరణమైనను భయము లేదను - మాన్య చారితు లెవ్వరో
|| వీరగంధము ||

## 16. మరచిపోవద్దోయ్! మరచిపోవద్దు

త్రిపురనేని రామస్వామి చౌదరి

పగవారు మన పైకి వచ్చి పడ్డారు
కోయంచు మన వూళ్ళు కొల్లగొట్టారు.
గూటిలో పిట్టల్ని కూచి వైచారు
పొలములో పసి లేళ్ళ పొడిచి వైచారు
మరచి పోవద్దోయి! మరచి పోవద్దు
మన జాతి అగచాట్లు మరచి పోవద్దు.

కారుకోనలు దూరి కలిగి పొయ్యారు
దుంప కూరల తిండి డ్రుంగి పొయ్యారు
గోచి పాతలు కట్టి క్రుంగి పొయ్యారు
ప్రొద్దెల్ల మనవారు పొగలి పొయ్యారు
మరచి పోవద్దోయి! మరచి పోవద్దు!
మన జాతి అగచాట్లు మరచి పోవద్దు!

పంగిళ్ళ కయ్యాల పంట్రించినారు
పసిపాప యుయ్యాల పారదన్నారు
నిదుర పోనీకోయి నీ చేతి కత్తి
త్రాగించు పగవారి రక్తంబు నెపుడు
మరచి పోవద్దోయి! మరచి పోవద్దు
మన జాతి అగచాట్లు మరచి పోవద్దు.

## 17. మా దేశం

వాన మామలై వరదాచార్యులు

పరదేశీయులు తొలగండి
ఈభారత దేశం మా దేశం
వినండి వినండి విశ్వ ప్రజలూ
వీర భారత సందేశం.
ఆ సేతు హిమాచల పర్యంతం
ఆ సర్వస్వం మా దేశం
ఆచంద్రార్కం ఆ నందనవన -
మంకితమయ్యెను మా కోసం.
శాంత్యహింసలను సత్యధర్మములు
సంరక్షించును మా దేశం
సహజీవనమును సహకారమ్మును
సంబోధించును అనిమేషం.
హిమాద్రి మొదలుగ కుమారి వరకు
హిందుస్తానం మా దేశం
సమస్త భాషా జాతి మత సరిత్ -
సంగమ జలనిధి ఈ దేశం.
భారత దేశ స్వాతంత్ర్యమ్మును
పరిరక్షించుటె మా లక్ష్యం
భారత దేశం మా దేశం
భారత రక్షణ మా లక్ష్యం.

## 18. అయ్యో కొయ్యోడ!

గరిమెళ్ళ సత్యనారాయణ

కొయ్యోడ! కొయ్యోడ! ఇలాగ రా రా!

కోటివింతలు - సెపుతానో (రయ్యో కొయ్యోడ!)

నువు కయ్యాలాడక చెప్పే కథను -

కడదాకాను వింటవరో (రయ్యో కొయ్యోడ!)

నే చెప్పిన దల్లా విని తర్వాత

తప్పులు ఉంటే తిట్టారో (రయ్యో కొయ్యోడ!)

కొయ్యోడంటే కోపం వస్తే

కొరడా దెబ్బలు కాస్తావో

ఆ కొయ్యోడంటి గొప్పోడవు ఐతే

కొరడా దెబ్బలు కాస్తారా

సీమ నుంచి పబులొచ్చి - సేతులిరిసి

కట్టారో (రయ్యో కొయ్యోడ!)

సేతుల తోడి రాయకూడదు -

సెప్పకూడదు నోటితో (రయ్యో కొయ్యోడ!)

కాళ్ళ తోటి యీ వూరొదిలి

పోరుగూరెల్ల కూడదో (రయ్యో కొయ్యోడ!)

ఒత్తిలంగ మనకు ఇంక ఏది త్రోవ లేదురో....

కత్తి బలము హేయ మంటు గాంధీ చెప్పినాడురో

వాని మాట బ్రహ్మ మాట - దాని మీర రాదురో

మొత్తిన గాని ఉగ్ర వంచి - మోద మందు చుండురో

చిత్తం బందున నెత్తగు జీతం - చేద టంచు నెంచరో
మానవ జన్మం బెత్తినావు - మనిషి రక్తం త్రాగకురో
పొరుగు వాని మాంసం తింటే - పొట్ట పగిలి పోతుందో
ఎచ్చు జీతం చేసిరని - హెచ్చరింప బోకురో
వెచ్చనైన బాష్పములను - వేగం వేగం కూర్పరో
పచ్చనైన హిందూ రాజ్యం - బద్దలయిందిరో రయ్యో

|| అయ్యో కొయ్యాద ! ||

దేవతలొచ్చి సీటికి మాటికి - తిరుగు చుండే రాజ్యమురో
కిన్నర లొచ్చి పాటలు పాడే - కీర్తివంత రాజ్యమురో
విద్యాధరులు వీణలు పాడే - వీనుల విందు రాజ్యమురో
గంధర్వులకు సుందరమైన - కన్నుల పండుగ రాజ్యమురో
వెండి కొండ పసిడి కొండ - వెలసినట్టి రాజ్యమురో
ముమ్మూర్తులకు ముఖ్యమైన - మూలస్థానం రాజ్యమురో
కమ్మని గాలి వీచే మంచి - గంధపు కొండ రాజ్యమురో
అది వన్నె వాడి సన్న గిల్లి - చెన్ను తరిగి యున్నది రో

|| అయ్యో కొయ్యాద ! ||

## 19. పదరా ! ఢిల్లీ ! వేగ పట్టుకొందాము

**గురజాడ రాఘవ శర్మ**

పదరా ! ఢిల్లీ ! వేగ పట్టుకొందాము
స్వాతంత్ర్య ధ్వజమట స్థాపించుదాము
నెత్తురు వరదల నిలచిన గడ్డ
సత్తువ గలదేని సాగుమో బిడ్డ !

మర ఫిరంగుల జూచి - మరలి పోబోకు
పర ప్రభుత కంటెమేల్ - మరణము నీకు
అల యుగంధరు కష్ట మాలింప లేవు
ఫలము జార విడచు భాగ్యహీనుడవు
నెమలి సింహాసనము - నిలచిన తావు
నమలి మ్రింగిన వారి నణచి చేకొనవు
మొగలాయిలే మేలు - మహాలులన్ గట్టి
మన సంపద హరించి మరల రేకొట్టి
నడిగడ్డ మనకు ప్రాణము మానమదిరా!
తడయక నీ శక్తి - ధారవోయుమురా!
భీష్ముడేలిన సుపవిత్రమౌ భూమి
కౌంతేయులేలిన ఘనమైన తావు
పృథ్వీరాజేలిన సాధ్వీలలామ
రాణి సంయుక్తకు రాణివాసమ్ము
స్వార్థపరులై వృథా చచ్చిపోకండి
సార్థక జన్ములై సాగి రారండి
పదరా! ఢిల్లీ! వేగ పట్టుకొందాము
స్వాతంత్ర్య ధ్వజమట స్థాపించుదాము.

## 20. పద పద ఢిల్లీ! పరుగున పోదాం

మల్లాది రామచంద్ర శాస్త్రి

పద పద ఢిల్లీ పరుగున పోదాం
పగర వేగమే, పారద్రోలగా

భారత దేశము పరాధీనమై
ప్రాధాన్యము చెడి, ప్రాభవముడిగి
పరువు గోల్పోయి, పరివేదనతో
పొగులు చున్నదిక ప్రమాద మొసగన్

|| పద పద ఢిల్లీ! ||

పురాతనమ్ముగ, ప్రసిద్ధి నందిన
భారతీయమగు, భవ్య సంస్కృతియె
ప్రాతిపదికగా ప్రపంచ శాంతిని
పాదు గొల్పియిక, పరి రక్షింపగ

|| పద పద ఢిల్లీ! ||

జయ్ అజాదుకు, నేతాజీకి
జయ్ జవ్హారుకు, జయ్ ప్రకాశముకు
జయ్ పటేలుకు, జయ్ పట్టాభికి
జయ్ గాంధీకి, జయ్ హిందంటూ
పద పద ఢిల్లీ
పరుగున పోదాం
పగర వేగమే
పార ద్రోలగా.

## 21. రారా పోదాము రాజ్యమేలుదాము

గరిమెళ్ళ సత్యనారాయణ

రారా పోదాము రాజ్యమేలుదాము
రాజ్యంబు నేలుచును రంజిల్లు చుందాము || రారా ||

తెల్ల దొరల నుండి ఇళ్ళెల్ల కాపాడి
ముల్లోకముల కీర్తి ముట్టించి వేదాము || రారా ||
దొరల జీతాలెల్ల విరగ ద్రోయుదాము
క్లుప్తమున మనయిల్లు కూర్చుకుందాము || రారా ||
ప్రతినిధి ప్రభుతను పొదుకొల్పుదాము
నిరంకుశత్వాన్ని నీట గలుపుదాము || రారా ||
దేశ కళలనెల్ల తేజరిల చేదాము
పాటక జనమునకు పనులు కల్పిద్దాము || రారా ||
ద్రవ్యంపు టేరునకు దారడ్డు నిలుదాము
నవ్యమ్ముగా ఇల్లు నవరణము చేద్దాము || రారా ||
ఉత్తమ విద్యలను ఉద్ధరించుదాము
చిత్త విభ్రమలను చెలగి చెండుదాము
రారా పోదాము రాజ్యమేలుదాము
రాజ్యంబు నేలుచును రంజిల్లు చుందాము

## 22. ఎదురు లేదు

యడ్లపల్లి కోటయ్య

ఎదురు లేదు ప్రజాశక్తి కెదురు లేదురా
కలసి అండ దండ యొాచు కదలి రమ్మురా
|| ఎదురు ||

పర ప్రభుత్వమును వేగ పార ద్రోలరా
ప్రాభవమున మన దేశము పల్లవించురా
|| ఎదురు ||

పాప భరము మోయలేక భరత మాత నీ
ప్రాపు చేరె, కన్న తల్లి భరము మాన్పరా
|| ఎదురు ||

లెమ్ము లెమ్ము భరత పుత్ర లెమ్ము రమ్మురా
లేచి ధర్మ మెరిగి జాతి కాచు కొమ్మురా
|| ఎదురు ||

ఎదురు లేదు ప్రజా శక్తి కెదురు లేదురా
ఎదురు లేదురా ఎదురు లేదురా.

## 23. రాట్న లక్ష్మి

### కాటూరి వెంకటేశ్వర రావు

నేను నీ యిలవేల్పునే చెల్లీ! నా తోడ ఆడుకొనవే
నేను గృహాలక్ష్మినే తల్లీ! నను మరచి పోతివటే
పూయరే పసుపు నాకు, కుంకుమపు బొట్టు నా నుదుట నిడరే
చేయరే యుపచారముల్ మరచుటకు చెంపలను వైచికొనరే
దీపమై వెలిగినానే, దివ్వెనై వెలిగినానె
కాపుదలగా ఉంటినే మును మీకు ఆపదల్ తొలగిస్తినే
మీ పెరటి కల్పకమునై మీకెల్ల ఆ పదలు బాపినానే
మీ పాలి వేల్పు టావై అమృతమ్ము చేసి మీ కొసగినానే
నీ నెత్తురున చుక్కనై చెల్లిరో! నీ మాంసమున కండనై
నీ ఎమ్ముకను మూలుగై తల్లిరో! నీవె నేనై యుంటినే
ఇల వేల్పు పూజమాని పెర వేలుపుల సేవ చేయబూని
కలుములకు దవ్వైతిరే! ఈ నాడు కష్టముల పాలైతిరే
మీరు నన్ను మరచినా తల్లిరో! మిమ్ము నే మరువ గలనా

పొర జూచి తెలియరే మీ పాలి పత్తి రాట్నమును నేను
నేను మీ యిలవేల్పునే చెల్లీ నా తోడ ఆడుకొనవే
నేను గృహలక్ష్మినే తల్లి నను మరచి పోతివటే.

## 24. స్వాతంత్ర్య శంఖారావం

**మామునూరు నాగభూషణ రావు**

భారత సోదర! పరుగిడి రారా!
ధీరుడవై స్వారాజ్య ప్రాప్తికి
వీరకంకణము దాల్చుము రా!

|| భారత సోదర ||

బానిస బ్రతుకిక బ్రతుకకు రా
భారత సోదర పరుగిడి రారా!
పారతంత్ర్యమును పారద్రోలగ
బద్ధ కంకణము తాల్చుము రా!
జీవన మరణము రెండే మనకిక-
లేదుర వేరొక దారి

|| భారత సోదర ||

దండికేగె మన పూజ్య బాపుజీ
దరి జేరగ రండి
ఉప్పును గొని మన ఉసురుల నిలపగ
ఉన్నాడిక భయపడకండి
తెల్ల దొరలు మన దేశమెల్లను
కొల్లగొనిరి యిక లేవరా
కుడుపను కూడూ, గుడ్డ కట్టుకొన
కరువైనవిరా మనకు

ఎంత కాలమీ బానిస బ్రతుకును
భరియింతువురా నీవు
చావో బ్రతుకో వరియింపగనటు
సాగుము ముందుకు లేచి
భారత సోదర! పరుగిడి రారా!

## 25. సహాయ నిరాకరణం

**కొండపల్లి జగన్నాథ దాసు**

నిరాకరణమను మిఠాయి యిదుగో
బిరాన రుచి చూడండీ
సత్యాగ్రహమను గోధుమ పిండిలో
సత్యసారమను ఆజ్యము పోసి
సాత్విక మను పెద భాండము లోపల
సత్యాగ్రహులు పాకము పట్టిన
|| నిరాకరణమను ||

శాంతం బనియెడు శనగ పిండిలో
శౌచం బనియెడి జలమును కలిపి
స్వధర్మమనియెడి పంచదారతో
స్వార్థత్యాగులు పాకము పట్టిన
|| నిరాకరణమను ||

మానవత్వమను బియ్యపు పిండిలో
జ్ఞానం బనియెడి తేనెను కలిపి
ముని గాంధీయను చెరకు బెల్లముతో
మున్సిపాలిటీ పాకము పట్టిన
|| నిరాకరణమను ||



దేశభక్తియను గోధుమ నూకలో
　　దేశముక్తియను వెన్నను గలిపి
దేశభక్తి జగమంతట నిండగ
　　దేశభక్తులు తయారు చేసెడి
నిరాకరణమను మిఠాయి యిదిగో
　　బిరాన రుచి చూడండి.

## 26. ఉప్పు చేశామిదుగో చూడండి

మంగిపూడి పురుషోత్తమ శర్మ

ఉప్పు చేశామిదుగో చూడండి! గాంధీ మహాత్ముని
ఉప్పు చేశామిదుగో చూడండి
ఉప్పు చేశామిదుగో దేవతలుప్పారంబుననుండి హర్షము
లుప్పతిల్లగ పుష్ప వర్షము గుప్పుచును ఆశీర్వదించగ
|| ఉప్పు చేశా ||

జర్మనీ అమెరికా మొదలగు సకల దేశపు ప్రతినిధులు మన
కర్మవీరుని శాంతియుద్ధపు కథలు ఫిలుములు చేసి చూపగ
|| ఉప్పు చేశా ||

ఉప్పు గనులను చవిటి నేలలు గొప్ప సాగర తీరముండగ
ముప్పు వచ్చెను గంజి లోపలి కుప్పు లేదని జాలి చెందుచు
|| ఉప్పు చేశా ||

ఎక్కడను ఏ కాలమున రాజెవ్వడైనా కట్టినాడా లెక్క చేయక
ఉప్పుపన్నును ధిక్కరింతము రండు రండని
|| ఉప్పు చేశా ||

గొప్ప భోగులు యోగులై పెనుగుంపులై కను సన్న నిల్వగ
రెప్ప పాటున ఉప్పు చట్టము టుప్పు టుప్పున ఎగర గొట్టుచు
|| ఉప్పు చేశా ||

దండి పుణ్యక్షేత్రమున ఉద్దండీ సాహసుడగు మహాత్ముడు
దండి బలవతులాంగి లేయులు బెండువడి తల తల్లవోవగ
ఉప్పు చేశామిదుగో చూడండి.

## 27. మా కొద్దీ తెల్ల దొరతనము

గరిమెళ్ళ సత్యనారాయణ

పల్లవి : మాకొద్దీ తెల్ల దొరతనము దేవ
మాకొద్దీ తెల్ల దొరతనము

అనుపల్లవి : మా ప్రాణాల పై పొంచి - మానాలు హరియించే
|| మాకొద్దీ ||

చరణములు

పన్నెండు దేశాలు పండుచున్నా గాని - పట్టెడన్నమె

లోపమండి
ఉప్పు! ముట్టుకుంటే దోషమండి!
నోట! మట్టి కొట్టి పోతాడండి
అయ్యో కుక్కలతో పోరాడి కూడు తింటామండి
|| మాకొద్దీ ||
వర్తకంబున కొచ్చి - పట్టణంబుల పట్టి - రాజ్యమొక్కటి
అల్లినాడు!
దాన్ని, రాణి కప్పగించినాడు!
రాణి! పత్రమ్ము చించేసినాడు
ఈ చిత్రమిదేమన్న శిక్షిస్తానంటాడు
|| మాకొద్దీ ||
కోర్టులంటూ పెట్టి - పార్టీలు పుట్టించి - స్నేహభావము
చంపినాడు
ద్రవ్య దాహము కల్పించినాడు
పెద్ద, ఊహాలు కడుపెంచినాడు
మా, ఆహారముల ద్రుంచి ఆహా! అనిపించాడు
|| మాకొద్దీ ||
ప్రజల క్షేమం కోసం - పెట్టిన సంస్థల ప్రభుల కోసం
మార్చేస్తాడు
వాట్ని - ప్రజల శత్రులు చేసుతాడు!
మమ్ము - గజిబిజి లాడ చేస్తాడు
వాడి - గడబిడ వర్ణింప - కాదు బ్రహ్మకైన
|| మాకొద్దీ ||
నూట నలుబది నాల్గు నోటికి తగిలించి మాటలాడ -
వద్దంటాడు
మమ్ము - పాట పాడ వద్దంటాడు

తనను - దాటి వెళ్ళ వద్దంటాడు
అయ్యో - చేటు తెచ్చుకో మమ్మొ చెడి పోవమంటాడు
|| మాకొద్దీ ||

ఏడాది కేడాది - తెక్కువ సిస్తేసి - ఈ భూమి నాదే అన్నాడు
మమ్మొ కూలికి దున్నుమన్నాడు
కడుపు మంటతో చావమన్నాడు
అయ్యో - బానిసలకు వాడు ప్రభువౌతనన్నాడు
|| మాకొద్దీ ||

ప్రభువు గాంధి తోడ - భారతదేశ మాత - పరమ తపము
చేసినాది
ధర్మ దేవత ప్రత్యక్షమైనాది
కోరిన వరము లిస్తానన్నాది
ఆ దొరల గుండెల లోన - దడ దడ పుట్టింది
|| మాకొద్దీ ||

## 28. వద్దురా మనకొద్దురా

### గరికపాటి మల్లావధాని

వద్దురా మనకొద్దురా - పర పాలనం ఇక వద్దురా
హద్దు పద్దూ లేని పన్నుల - రుద్ది పీల్చుచునుండెరా
|| వద్దురా ||

కర్రలాగి, కత్తిలాగి - గొర్రెలను చేశాడురా
వెర్రి మొర్రి 'లా' యటంచును - విర్ర వీగుచునుంటెరా
|| వద్దురా ||

వెండి బంగారములనెల్ల దండి లాగేశాడురా

ముంత మోపి కాగితాలకు - దండమిడుమన్నారురా

|| వద్దురా ||

లేవరా ఇది వేళరా - మన జీవితంబిక ఏలరా
కావ లేవా కన్న తల్లి - గౌరవము కాపాడరా

|| వద్దురా ||

మాన ప్రాణములకు మహా - మ్మారియై యున్నారురా
దీనయై మన దేశమాత దేవులాడుచునుండెరా

|| వద్దురా ||

ఏడు కోట్ల ప్రజలు గుడ్డ - కూడు లేకున్నానురా
మాడు గొట్టి ప్రజల సొమ్ము - ఓడ లెక్కించాడురా

|| వద్దురా ||

కుర్రలకు పెద్దలకు సైతం - వెర్రు లెత్తించాడురా
బుర్ర తిరుగుడు మందు పెట్టి - వెర్రులను చేశాడురా
వద్దురా మనకొద్దురా పరపాలనం బిక వద్దురా.

## 29. వీరావేశం

### మల్లాది రామచంద్ర శాస్త్రి

వీరావేశం చెందినారమిక
వీర విహారం చేస్తాము
పరాధీనతన్ బాపుకొనంగా
ప్రళయ భేరి మ్రోగిస్తాము
దేశద్రోహాల గుండెలవియెగా
సింహ గర్జనం చేస్తాము
దేశమంతటా దుర్భిక్షమ్మిక

తలెత్తకుండా చూస్తాము
తెల్లవారికిక తొలగి పొండనుచు
తెల్లముగా చెప్పేస్తాము
ఢిల్లీ కోటను విజయ పతాకం
త్వరలో నెలకొల్పేస్తాము
ప్రళయ బాంబు విలయమ్మున తేనని
ప్రముఖులచే చెప్పిస్తాము
ప్రపంచ శాంతికి సత్యాహింసలె
ప్రధానమని చాటిస్తాము
వీరావేశం చెందినారమిక వీర విహారం చేస్తాము
పరాధీనతను బాపుకునేందుకు ప్రళయ భేరి మ్రోగిస్తాము.

## 30. విప్లవ జ్వాల

### సాంబశివ రావు బాడీ

ఉబుకుచు వచ్చే - ఉద్రేకంలో
రాలిపోయినై - రత్నా లెన్నో
ఉరకలు వేసే ఉత్సాహంలో
కూలిపోయినై హృదయాలెన్నో
ఉవ్విళ్ళూరే - ఉబలాటంలో
మంట గలిసినై ప్రాణాలెన్నో
వీర భారత యువకుల్లారా!
విజయోత్సాహిత మూర్తుల్లారా!
విన్నారా? మన వీరుల చరితం?
కన్నారా? ఆగస్టు విప్లవం?

ప్రాణం పోతే పోయిందీ - మన
భారత మాతకు స్వాతంత్ర్యం
భుగ భుగమంటూ భూమ్యాకాశాల్
అలుముకున్న ఆ విప్లవ జ్వాలలు
యువతీ యువకులు, పిన్నలు పెద్దలు
బలియై పోయారాజ్యోతుల్లో
వీర భారత యువకుల్లారా!
విజయోత్సాహిత మూర్తుల్లారా!
విన్నారా మన వీరుల చరితం?
కన్నారా ఆగస్టు విప్లవం?
విప్లవ జ్యోతుల కిరణ కాంతితో
ఉదయించాడు స్వతంత్ర భానుడు
విప్లవ వీరుల నెత్తురు నదిపై
ప్రసరించిందీ స్వతంత్ర వాయువు
విప్లవ నేతల త్యాగ జలధిలో
వెలుగొందిందీ స్వతంత్ర భారత్
వీర భారత యువకుల్లారా!
విజయోత్సాహిత మూర్తుల్లారా!
విన్నారా మన వీరుల చరితం?
కన్నారా ఆగస్టు విప్లవం?

# 31. ఆగస్టు పదిహేను

ధవళా శ్రీనివాస రావు

అమ్మ కడగండ్లన్ని అంతరించాయి
అమ్మ కమ్మని రోజులవతరించాయి
మా గాంధి బాబయ్య మంత్రమే మా యమ్మ
చెర బాపి స్వాతంత్ర్య శిఖరమెక్కించింది.
వెలుగుకై తపియించి విసిగి పోయిన రేయి
అన్నానికే అర్రు లెత్తి చాచిన పూట
గుడ్డకై మర్యాద కోలుపోయిన ఘడియ
ఇనుప సంకెళ్ళ బరువులు మోయ లేక
కొన ప్రాణముల తోడ కొట్టు కొన్న యుగాలు
తలపులో పలుకులో నడకలో బాటలో
అన్నింట దాస్యమ్ము అనుభవించిన కాల-
మాగస్టు పదిహేనుతో అంతమైనాది.
మా తల్లి విజ్ఞాన మహితయై అనిశంబు
తోడి దేశాలతో గూడి తలనెత్తుకొని
గరువంబుతో తిరుగు కాలమేతెంచింది
అమ్మ కడగండ్లన్ని అంతరించాయి
అమ్మ కమ్మని రోజులవతరించాయి.

## 32. భారత విజయం పాడండి

### వేదుల సత్యనారాయణ శాస్త్రి

పవిత్ర భారత సవిత్రికోహో
స్వతంత్రోత్సవం సాగింది
లాల్ కిల్లాపై అశోక చక్రపు
త్రివర్ణ కేతన మెరిగింది || పవిత్ర ||
మతం తలవక గతం తడవక
ద్వేషం రోషం సకలం మరచి
స్వతంత్ర భారత జయపతాకకు
సోదరులారా! మ్రొక్కండి || పవిత్ర ||
నెత్తురు లోడ్చిన సత్తువలూడ్చిన
పిశాచ దాస్యం నశించిందని
ప్రపంచమంతటా ప్రతిధ్వనించగ
స్వతంత్ర శంఖాలూదండి || పవిత్ర ||

* * * * *

అమోఘ శక్తుల సమీకరించుక
సమస్త భారత సమైక్య మెంచుక
హిమాద్రి మొదలు కుమారి వరకు
భారత విజయం పాడండి || పవిత్ర ||

(1947 ఆగస్టు 15 రాత్రి 12 గంటలకు పేరూరులో పాడిన పాట)

# 33. పతాకోత్సవము సేయండీ

"బసవరాజు అప్పారావు"

పతాకోత్సవము సేయండీ
స్వతంత్ర భారత జాతి చిహ్నమౌ
పతాకోత్సవము సేయండీ ||
కొత్త వన్నెలూ - కొత్త చిన్నెలూ
కొత్త జీవమూ కొమరొప్పంగా
నూతన భారత జాతికి భువిలో
ఖ్యాతి విజయమూ - కలగాలంటూ
పతాకోత్సవము సేయండీ ||



వీర కేసరుల యెర్రని రంగూ
దేశసేవకుల తెల్లని రంగూ
భక్తుల పాలిటి పచ్చని రంగూ
బీదల పాలిటి రాట్నము మెరిసే
పతాకోత్సవము సేయండీ
అన్ని మతాలకు అన్ని తెగలకూ
ఆశ్రయమీ జండా ఒకటేనోయ్
ప్రాణము పోతే పోనీ జండా -
మానము మాత్రము మంట గలపక
పతాకోత్సవము సేయండీ ||

## 34. స్వాతంత్ర్య పతాక

సుంకర సత్యనారాయణ

ఎగురవే వినువీధి ఎగురవే జండా
శాంతి దూతగ నేడు - జాతీయ జండా
యుగయుగంబుల జగతి నెగురవే జండా
సౌఖ్యప్రదాతగా స్వాతంత్ర్య జండా ||
భారతీయుల మహా పోరాట ఫలితమా
వీర యోధుల రక్త ధారలకు చిహ్నమా
శాంతిమాత అశోక ధర్మ చక్రము దాల్చి
శాంతినిల స్థాపించ నరుదెంచితివి నీవు ||
పెను తుఫానులనెన్ని పెనవేసుకున్న
దనుజులందరు గూడి, నిను దింపకున్న
కడ భారతీయుండు పడిపోవు దనుక

గగనాన ధృవతార కరణి నిల్పెదవు ||
ఎగురవే వినువీధి ఎగురవే జండా
శాంతి దూతగ నేడు జాతీయ జండా

## 35. స్వాతంత్ర్య భారత జాతీయ జండా

**గురజాడ రాఘవ శర్మ**

విహరింపనిమ్మా! విహరింపనిమ్మా!
స్వాతంత్ర్య వినువీధి జాతీయ జండా!
|| విహరింపనిమ్మా ||

విశ్వ విఖ్యాతిగా - విజయ నాదలతో
విశ్వమోహనముగా - వెలసిన జండా
వీర భారత జాతి - వెలిగిన జండా!
|| విహరింపనిమ్మా ||

మూడు రంగుల తోడి - ముచ్చట గూడి
తోడు నీడయి ధర్మ - చక్రమ్ము కూడి
క్రీడించనీయండి - ప్రియమైన జండా!
|| విహరింపనిమ్మా ||

సాహస త్యాగాలు - శాంతి సత్యాలు
ఆత్మ విశ్వాసాలు - ఔదార్య భావాలు
చక్కగా పాలించు జాతీయ జండా!
|| విహరింపనిమ్మా ||

సేతు శీతాచల స్థిర భరత జాతి
ఖ్యాతి నిల్పినయట్టి జాతీయ జండా
స్వాతంత్ర్య భారత జాతీయ జండా! ||

విహారింపనిమ్మా! విహారింపనిమ్మా!
స్వాతంత్ర్య వినువీధి జాతీయ జండా!

## జాతీయ గీతం

### విశ్వకవి రవీంద్రనాథ్ ఠాకూర్

జన గణ మన అధినాయక జయహే!
భారత భాగ్య విధాతా
పంజాబ్ సింధు గుజరాత్ మరాఠా
ద్రావిడ ఉత్కళ వంగా
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగా
తవ శుభనామే జాగే
తవ శుభ ఆశిష్ మాగే
గాహే తవ జయ గాథా
జన గణ మంగళ దాయక జయ హే,
భారత భాగ్య విధాతా
జయ హే! జయ హే! జయ హే!
జయ! జయ! జయ! జయ హే!

Lasertypeset at Modern Computer Centre, Laxmi Nagar, Delhi-110092 and printed at JJ Offset Printers, Printing Press Area, Wazirpur, Delhi-110035